421. వ. అంతంతం గనుంగొని యత్యంతవినయసంభ్రమంబులతోఁ దండప్రణామంబు సేసి యాసనార్ఘ్యపాద్యాదిపూజనంబుల నారాధించి సమీపభూమిం గూర్చుండి కృతాంజలి యై సుప్రసన్నం బగునమ్మహాముని వదనంబు వీక్షించి.

422. తే. అవధరింపు మహాత్మ కయ్యమున నేను
శాత్రవుల నేయఁ [1]బూనుచోఁ సరభసముగ
నడరి ముందట నొకరుఁడు పుడమి నడుగు
లిడక [2]పావకనిభమూర్తి యెసక మెసఁగ.

423. చ. కిరణము లుల్లసిల్లఁ దన కేల నుదగ్రపుశూల ముండఁగాఁ
బొరిఁబొరి నందు ఘోరముగఁ బుట్టిన శూలపరంపరల్ గరం
బరుదుగ వారినెల్లఁ దెగటార్పఁగ నే వెనుకన్ శరంబులం
గురియుచుఁ [1]జంపినాఁడ ననికొందు జయంబు సముద్భటంబుగన్.

424. క. అప్పురుషుఁ డెవ్వఁడో యని
యెప్పుడు మదిఁ దలఁతు నతని నేర్పడ నాకుం
జెప్ప [1]వలయు [2]నని యడిగిన
నప్పార్థున కిట్టు లనియె నమ్ముని ప్రీతిన్.

425. వ. నీయడిగినయతండు.

426. ఉ. ఆది[1]కి నాది లోకముల కన్నిఁటికిం బ్రభుఁ [2]డవ్యయుండు వే
దాదిపవిత్రవాచక[3]సహస్రపరిస్ఫుట[4]వాచ్యరూపుఁ డం

---

422. 1. జూచుచోఁ - వ. కొన్ని ప్రతులు. 2. దినకరప్రతిమూర్తి - ఉ. క. మ. హ. పావకప్రభమూర్తి - కొన్ని ప్రతులు.

423. 1. జంపె నాగ గయికొందు జయంబు - ష; జంపినాడ నయికొందు జయంబు- అ. ఇ. ఏ. క. కొన్ని ప్రతులు.

424. 1. వలె నన్న పార్థున కప్పుడు మది సంతసిల్లయమ్ముని ప్రీతిన్ - ఉ. ర. 2. మీరన వుడు - ఠ.

426. 1. పినాకి - చ. 2. వవ్యయుండు - కొన్ని ప్రతులు. 3. సమగ్రపరిస్ఫుట గోచరుండు - స. 4. వాచ్యరూపు - అ. ఒ. ఓ. ఔ. క. గ; వాచ్యమాను, కీర్తనీయు, గోచరుడునంపహ్వో - అని పాఠములు; వాక్యరూపు - వా.

హోదళనప్రకారక శుభోదయకారకదివ్యనాముఁ డం
గాదయితుండు దృఙ్మహితఫాలుఁడు భోగ్యుఁడు భక్తియుక్తికిన్.

427. క. యోగీంద్రచిత్తకమలా
భోగమధుపనిభుఁడు ప్రకృతిపురుషాత్ముఁడు ని
ర్భోగస్వరూపుఁ డవ్య
క్తాగోచరుఁ డధికసులభుఁ డమలాత్ములకున్.

428. ఉ. నీలగళుండు శంకరుఁడు నిత్యుఁడు సత్యసురూపుఁ డుజ్జ్వల
త్కాలమహానలప్రశమకప్రచురామృత[1]వృష్టివిస్ఫుర
ద్బాలమృగాంకశేఖరుఁడు దైత్యకుల[2]ప్రవిదారణక్రియా
లోలపరశ్వథుండు [3]సకలుం డమలుండు ప్రియుండు శాంతికిన్.

429. వ. అని ప్రశంసించి [1]కవ్వడి గనినవాఁడు రుద్రుం డగుటఁ దేటపఱచి దక్షమఖమథనత్రిపురమర్దనాదు లగు నద్దేవునిదివ్యలీల లుపన్యసించి మహాదేవపశుపతిశివప్రముఖంబు లగు తదీయభవ్యనామంబులకుం బ్రవృత్తినిమిత్తంబు లగు నర్థంబులు దెలియ [2]నిర్వచనంబు సేసి యట్టిపరమేశ్వరుండు నీకు వరదుం డయి సన్నిధి సేసె నతనిం గని పెన్నిధిఁ గన్న పేదవోలెం గృతార్థుండ వై తయ్యంధకాసురభంజనుకతంబున గడిందిపగ అడంగుదు రయ్యాదిమధ[3]నుర్ధరుం డివ్విధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపు గొనుట సుకరం బయ్యె నీతపంబు పెంపునం దొల్లి సన్నిహితుం డై నీకుం బ్రియంబుగా దివ్యాస్త్రంబు లొసంగె నంతటం దనివి సనక యిత్తెఱంగున భక్తపరాధీనత్వంబు ప్రకటించె నీవు [4]పుణ్యాత్ముండ వప్పరమాత్ము నాత్మ నిలిపి నమస్కరింపు మాసర్వలోకశరణ్యు శరణంబు సొరు మక్కరుణాకరుండు శరణా

---

428. 1. దృష్టి – కొన్ని ప్రతులు. 2. ప్రళయాంతకక్రియా – ల. 3. కుశలుండు గలం డఘతాపశాంతికిన్ – స; దచలుం డమయుండు – ల.

429. 1. కవ్వడిసే గనినవాఁడు రుద్రుం డని తేటపరచి – వ. పీ. శ. ష. 2. వ్యుత్పన్నంబులు సేసి – కొన్ని ప్రతులు. 3. మహావీరుండు – కొన్ని ప్రతులు. 4. మహాభాగుండ – ఇ.

గతులకు నాయురారోగ్యైశ్వర్యాదిసకలాభిమతంబులు నిత్యంబులుగాఁ బ్రసాదించు నని సద్దేశించిన నయ్యర్జునుండు దండప్రణామపూర్వకంబుగా భక్తిరసాయత్తం బగుచిత్తంబునం [5]జంద్రధరు నెలకొలిపి సాంద్రానందం బనుభవించి సాత్యవతేయుచరణంబుల కెఱఁగిన నమ్మునీంద్రుం డయ్యింద్ర నందను నభినందించి సుఖివి గమ్మని దీవించి విజయంచేసె నని యిట్లు సంజ యుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.

430. క. మునివర ద్రోణుని[1]వృత్తము
వినిసంతుష్టుండ నైతి విను వేడుక నా
మనమునఁ దోఁడ్తో నొదవెడు
వినిపింపు దగంగ మీఁదివృత్తాంతంబున్.

431. వ. అని యడుగుటయు.

432. చ. అమరకిరీటకోటి[1]కలితారుణరత్నమరీచివీచికా
సముదయఖేల[2]నోల్లసనచారుపదాంబుజకాంతిపూర దు
ర్దమ[3]దనుసూనుసంచయవిదారణ చిత్తవిహారబోధనా
గమహితనాదనిర్వహణకౌతుక[4]విశ్రుత రక్షితాశ్రితా.

433. క. [1]జనవినుత బాదరాయణ
మునీంద్ర వాగమృతనిధిసముద్భూతాహ్లా
దనకీర్తిసుధాకిరణా
వినతాఖిలభద్రకరణ విశ్రుత[2]చరణా.

---

5. నిందుధరు - కొన్ని ప్రతులు.

430. 1 వర్తన - కొన్ని ప్రతులు.

432. 1. ఘటితారుణ - బ. వ. 2. నోల్లసిత - వ. శ. ష. కొన్ని ప్రతులు. 3. దనుజానుశాసన విధానతవిత్తవిహార - స. 4. విశ్రుత - అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు; మిశ్రిత ౨ వా.

433. 1. వినుతిపర - క. ఖ. హా; వినుతపద - కొన్ని ప్రతులు. 2. కరుణా - కొన్ని ప్రతులు.

434. మాలిని అమృతమయవిలాసా యోగ[1]భాస్వద్విలాసా
విమలహృదయరమ్యా [2]వీతరాగాదిగమ్యా
కమలభవనమస్యా గౌరవాధిక్యశస్యా
శమదమపరివర్తీ శాశ్వతానందమూర్తీ.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య
పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం
బయిన శ్రీమదాంధ్ర మహాభారతంబున
ద్రోణపర్వంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.

శ్రీమదాంధ్ర మహాభారతము నందలి ద్రోణపర్వము సంపూర్ణము



434. 1. భాస్వద్విలాసా – వ; భోగోద్వికాసా – వా. 2. విశ్రుతజ్ఞాన శమ్యా – ఏ. ర. వేదసారానుగమ్యా – వ. 3. సేవ్యా – కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము

### గద్యపద్య ప్రథమపాదసూచి

## ఈ



## ఉ

## ద

## మ.

## హ



— (౦) —

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము

### గద్య పద్య ప్రథమ పాదసూచి

| పద్యము | పుట |
|---|---|

## ఆ

## ఇ

## ఈ



## ఉ

| పద్యము | పుట |
|---|---|
| | |

## ఊ



## ఎ



## ఏ



## ఐ



## ఒ

## ఖ



## గ

# భ



# మ